ఓమ్.

శ్రీ పరబ్రహ్మణే నమః.

శ్రీకృష్ణద్వైపాయన మహాముని ప్రణీతము.

రాజయోగ అష్టాంగ యోగాధ్యాయ సహిత

# బ్రహ్మసూత్ర రహస్యము - వచన కావ్యము.

ఈ గ్రంథము,

సంస్కృత ప్రాకృత వైకృతాద్యనేకభాషా నిపుణులగు

బ్రహ్మశ్రీ, వెన్నెలకంటి - సుందరరామ శర్మగారిచే

విరచితము.

బరూను, త్యాగరాయ శాస్త్రులు అండ్ సన్ గారిచే

స్వకీయ

గీర్వాణ భాషా రత్నాకర ముద్రాక్షర శాలయందు

ముద్రితము.

చెన్నపురి,

1920

[ క్రయం 0-5-0 తపాల్ ఖర్చులు 0-4-0 ]







# ఓమ్.

## బరహారు. త్యాగరాయశాస్త్రి

పూర్వాశ్రమ ప్రసిద్ధాభిధాన

రాజయోగి - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి.

కలియుగ గతాబ్దాః 5017 నళ సంవత్సరే తులామాసే

షష్ట్యబ్దపూర్తిః - రాజయోగాశ్రమ ప్రవేశః.

శ్రీ

# నూతన గ్రంథ రత్నముల ప్రకటన.

## జ్ఞానవాశిష్ఠము - తెనుగు వచనకావ్యము

అత్యాశ్చర్య కరమైన "ఈ మాయాప్రపంచము" ఎట్లు కలిగెనో తెలుపును. అతి మాధుర్యమైనది. పునర్జన్మ రహితమైనది, రూ 5—0—0

## బ్రహ్మసూత్రములు

## తెనుగు టీకా తాత్పర్య సహితము.

ఇదియే శారీరక బ్రహ్మమీమాంసా. జన్మ, జరా, మరణ, దుఃఖములను పోగొట్టును. రూ 2—8—0

## శ్రీ వేదాంత పంచదశీ

## తెనుగు టీకా తాత్పర్య సహితము.

శ్రీ జగద్గురు విద్యారణ్యస్వామి విరచితము, మంత్రి - లక్ష్మీనారాయణ శాస్త్రి విరచిత తెనుగు టీకా తాత్పర్య సహితము మోక్షప్రదమైనది. రూ 5—0—0

## యల్లాజీయము - తెనుగు తాత్పర్యసహితము.

సప్రయోగ ధర్మశాస్త్రము. ప్రాయశ్చిత్త కారికాది సహితము. రూ 2—0—0

## యక్షప్రశ్నలు - తెనుగు తాత్పర్యసహితము.

ధర్మరాజునకును, యక్షునకును, జరిగిన ప్రశ్నలు. అనేక నీతులును, అనేక ధర్మరహస్యములును గలవు. రూ 0—5—0

# భగవద్గీతలు - సమగ్ర గ్రంథము

## తెనుగు వచనకావ్యము.

శ్రీ కృష్ణమూర్తి అర్జునునకు ఉపదేశించినది. జగత్ప్రసిద్ధ గ్రంథము. సంస్కృత భాష తెలియని స్త్రీలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మొదలగు వారలకు నిత్యపారాయణోపయుక్తము. మోక్షసాయుజ్యమును గలుగ జేయును.

రూ॥ 0—12—0

# స న త్కు మా ర గీ త లు

## తెనుగు వచన కావ్యము.

ఇదియే సనత్సుజాతీయము. భగవద్గీతలలో జెప్పబడని అనేక వేదాంత రహస్య విషయములు గలవు. నిత్య పారాయణోపయుక్తము.

రూ॥ 0—5—0

# బ్రహ్మసూత్ర ర హ స్య ము

## తెనుగు వచన కావ్యము.

ఒక్కడే అయిన పరమాత్మ, ఒక్కడుగాను, ప్రపంచ రూపుడై అనేకముగాను ఉండుటను తెలుపును. అష్టాంగయోగ, రాజయోగాధ్యాయ సహితము.

0—5—0

# ని త్య దే వ పూ జా క్ర మ ము.

స్త్రీలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, నిత్యము దేవునిపూజ చేయవలసిన క్రమమును మంత్రములతో గూడ తెలుపును

0—5—0

# సస్యానందము - తెనుగుతాత్పర్యసహితము.

సస్యములయొక్క ఉత్పత్తికి కారణము, సస్యోత్పత్తి లక్షణము, మేఘ గర్భకాలము, మేఘ గర్భపాత లక్షణము, మేఘ గర్భ పరిపక్వ కాలము, వర్షప్రశ్న లక్షణము, గ్రహసంచార లక్షణము, మొదలగునవి కలవు. 1—0—0

# మహావాక్యరత్నావళి

# తెనుగు తాత్పర్య సహితము.

భగవంతుడగు శ్రీరామమూర్తి అష్టోత్తర శతోపనిషత్ రత్నాకరమునందుగల మహారత్నములనెల్ల ఒక్కొక రత్నముగ వెతికియెత్తి కంఠహారముగా జేసి శిష్యుడైన ఆంజనేయస్వామియొక్క కంఠమునకు ఈమహావాక్యరత్నావళీ హారమును అలంకరించిరి:—అనగా శ్రీరామమూర్తి ఇమ్మహావాక్య రత్నావళిని ఆంజనేయస్వామికి ఉపదేశించిరి. ఈప్రపంచమును సృష్టించిన పరబ్రహ్మము ఇదేను అని వేదవాక్య ప్రమాణములతోను, లక్షణములతోను, సప్రమాణముగ ఉపదేశించును. 1—0—0

# దశోపనిషత్తులు - తెనుగు తాత్పర్య సహితము అచ్చగుచున్నవి.

తపాలా ఖర్చులు ప్రత్యేకము.

---

మైలాసము—బరూరు - త్యాగరాయశాస్త్రిలు, అంన్ సన్.

216 గోవిందప్పనాయనివీధి, మదరాస్.

ఓమ్

శ్రీ పరబ్రహ్మణే నమః.

# విజ్ఞాన నౌకాస్తోత్రమ్.

తపోయజ్ఞ దానాదిభి శ్శుద్ధబుద్ధి ర్విరక్తో నృపాదౌపదే తుచ్ఛబుద్ధ్యా । పరిత్యజ్యసర్వం యదాప్నోతితత్వం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 1

దయాళుంగురుం బ్రహ్మనిష్ఠం ప్రశాంతం సమారాధ్యభక్త్యా విచార్యస్వరూపమ్ । యదాప్నోతితత్వం నిదిధ్యాస్యవిద్వాన్ పర బ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 2

యదానందరూపం ప్రకాశస్వరూపం నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యమ్ । అహం బ్రహ్మవృత్త్యైకగమ్యం తురీయం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 3

యదజ్ఞానతోభాతి విశ్వంసమస్తం వినష్టంచసద్యో యదాత్మప్రబోధః । మనోవాగతీతం విశుద్ధం విముక్తం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 4

నిషేధేకృతే నేతినేతీతివాక్యై స్సమాధిస్థితానాం యదాభాతిపూర్ణమ్ । అవస్థాత్రయాతీత మద్వైతమేకం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 5

యదానందలేశై స్సమానందవిశ్వం యదాభాతిసత్వే తదాభాతిసర్వమ్ । యదాలోచనే హేయమన్యత్సమస్తం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 6

అనంతంవిభుం విశ్వయోనింనిరీహం శివం సంగహీనం యదోంకార గమ్యమ్ । నిరాకార మత్యుజ్వలం మృత్యుహీనం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥ 7

యదానందసింధౌ నిమగ్నః పుమాన్స్యా దవిద్యావిలాస స్సమస్తప్రపంచః । యదానస్ఫురత్యద్భుతం యన్నిమిత్తం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి ॥

స్వరూపానుసంధాన రూపః స్తుతిం యః పఠేదాదరా ద్భక్తి భావో మనుష్యః । శృణోతీహవా నిత్యముద్యుక్తచిత్తో భవేద్విష్ణుర త్రైవ వేదప్రమాణాత్ ॥ 9

విజ్ఞాననావం పరిగృహ్యకశ్చి త్తరేద్యదజ్ఞానమయం భవాబ్ధిమ్ । జ్ఞానాసినాయోహి విఛిద్యతృష్ణాం విష్ణోఃపదంయాతి సఏవ ధన్యః ॥ 10

ఇతి శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యవర్య

శ్రీమచ్ఛంకరాచార్య విరచితం విజ్ఞాన

నౌకాస్తోత్రం - సంపూర్ణమ్.











శ్రీపరబ్రహ్మణేనమః.

# బ్రహ్మసూత్రరహస్యము

## వచనకావ్యము.

శ్లో॥ ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణఃపురా।
కంఠంభిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ॥

మానవుడు శాస్త్రోక్తములగు నిత్యనైమిత్తిక సకల కర్మలను ఆచరించెనేని చిత్తశుద్ధి కలుఁగును. దానిచే ఈ ప్రపంచమంతయును అనిత్యమనియును, ఈప్రపంచమును నియమించుచున్న పరమేశ్వరుడు నిత్యుఁడనియును, తెలిసికొనదగిన జ్ఞానము కలుగును. దీనికే నిత్యానిత్య వస్తు వివేకమని పేరు. ఆజ్ఞానము అభివృద్ధియగు కొలది అనిత్యమగు ప్రపంచమునందు అనగా మనము అనుభవించుచున్న శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అను విషయముల యందు ఇచ్ఛ తొలఁగును.

ఆ శబ్దాదివిషయమును అనుభవించుట అవివేకియగువానికి ఆనందకరముగ నుండునుగాని, పైన జెప్పబడిన నిత్యానిత్య వస్తువివేకము గలవానికి అట్లుండదు. ఆశబ్దాదివిషయములను సంపాదించునప్పుడు జనించు ఆయాసమునుఁ గూర్చియును, అనుభవ కాలము మిక్కిలి స్వల్పమై యుండుటనుఁ గూర్చియును, అనుభవానంతరమున దుఃఖము కలుగుటను గూర్చియును, ఆయనుభవమువలన ఇంద్రియముల శక్తి నశించుటను గూర్చియును, దలంచినప్పుడు వాని యొక్కమనస్సు మిక్కిలి సంక్షోభించును.

ఈవిషయములు రెండువిధములై ఉన్నవి. ఈ లోకమునందు సామాన్యముగా అనుభవింపఁబడుచు గొన్నియు, పరలోకముల యందు విశేషముగ అనుభవింపఁబడుచు మఱికొన్నియు అవివేకుల మనస్సును కలవర పెట్టుచున్నవి. వివేకియగువానికి ఈరెండువిధములగు విషయములందును సంపూర్ణముగ ఇచ్ఛనశించును. ఇదియే వైరాగ్యము. లేక ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము.

ఈవైరాగ్యమువలన మనస్సు పూర్వమువలె నిటునటు చలింపక నిశ్చలమై నిలుచును. ఇదియే శమము. సకలేంద్రియములును మనస్సున కధీనములై యుండును. కావున ఆమనస్సు నిశ్చలము కాగానే అవియు క్రమముగ విషయములను ఆశ్రయింపక స్థిరములై యుండును. ఇదియే దమము అనఁబడును.

ఇట్లు ఇంద్రియ చిత్తములు శాంతములయ్యేనేని వికారము లేవియును గలుఁగవు. స్వస్థత జనించును. దీనికి ఉపరతి యని పేరు.

ఈయుపరతిగలవాఁడు శీతోష్ణము వలనఁగాని, సుఖదుఃఖముల వలనఁగాని, బాధ నొందఁడు. వానినెల్లను ఓర్చుకొనును. ఏదివచ్చినను, ఏదిపోయినను, రాగద్వేషములను బొందఁడు. ఈ ఓర్పునకు తితీక్ష యనిపేరు. ఇట్టి స్థితి గలవానికి పరమేశ్వరుని యథార్థ స్వరూప స్వభావములను ఎఱుగవలయునని సంకల్పము జనించును. దానిచేత వాఁడు భక్తియుక్తుఁడై సద్గురువులను వెదుక నారంభించును. వేదాంతవాక్యములను వినుటకు ఉపక్రమించును. శ్రవణము ( వేదాంతవాక్యముల వినుట) తప్ప వానికిరెండవపనితోఁపదు. దీనికే శ్రద్ధయనిపేరు.

ఇట్లు శ్రద్ధావంతుఁడగు పురుషుఁడు శ్రవణము చేయునప్పుడు మనస్సును మఱియొక స్థలమునకు బోనీక తానువినిన విషయములను మననము జేయుచుండును. ఇదియే సమాధానమనఁబడును. శమము మొదలగు ఈయాఱు గుణములను కలిఁగియుండుటయే శమాది షట్క సంపత్తి. ఈశమాది షట్క సంపత్తి గల పురుషుఁడు మనన పూర్వకముగా వేదాంతవాక్య శ్రవణము జేయుటచేత "బ్రహ్మమునకును, జీవునకును, భేదములేదు, అట్టిభేదము కలదని తలంచుట భ్రాంతి, అట్లు దలంచువానికి ఎప్పటికిని సంసారబంధము తొలఁగనేరదు" అని సామాన్యముగా దెలియవచ్చును. ఈ విషయము స్పష్టమగుటకు అధికమగు విచారము అవశ్యముకదా. కావున ఆపురుషుఁడు మోక్షమును జెందవలయునను కోరికతోను, తానే పర బ్రహ్మము అగుటయందలి సంశయముతోను, బాధపడును. ఇదియే ముముక్షుత్వము.

ఇట్లు నిత్యానిత్య వస్తువివేకము ఇహాముత్రార్థఫలభోగ విరాగము, శమాది షట్క సంపత్తి, ముముక్షుత్వము, అను నాలుగుసాధనములను సంపాదించిన అధికారి పరమేశ్వరుని స్వరూప స్వభావములను విచారించుటకు ఉపక్రమింప వలయును. ఈసాధనములు లేకపోయినయెడల ఆబ్రహ్మవిచారము నిష్ప్రయోజనమగును.

ఒకపక్షమున బ్రహ్మస్వరూపము వానికి దెలియవచ్చుటయే అబద్ధము. కొంత సూక్ష్మబుద్ధిగలవానికి దెలిసినను, దెలియవచ్చినను, తగిన చిత్తశుద్ధి లేకపోవుటచేత నిస్సంశయముగ అనుభవసి

ద్ధమై నిలచుట అబద్ధము. రెండవపక్షమున వానిమనస్సు బ్రహ్మస్వరూపమును ఎఱుగునంతటి సామర్థ్యము లేనిదగుటచేత పైకి అందుకొ్న నేరక, పరోక్షజ్ఞానము (బ్రహ్మమునకును జీవునకును భేదములేదు అను సామాన్య జ్ఞానము) కలది యగుటచేత క్రింద (జీవుఁడువేఱు, బ్రహ్మవేఱు, అను భేదభావన ఉన్నప్పుడు చేయఁదగిన కర్మోపాసనాదులయందు) నిలువనోల్లక ఉభయ భ్రష్టమై చెడిపోవును. బ్రహ్మజ్ఞానము ఒక్కటియే కాదు (ఏవిషయమైనను సరియే తగిన అధికారము లేనివానికి ఉపదేశింపఁబడినచో లాభమునకు మారుగా నష్టమును కలిగించును. దానిని దీర్చుటకు నాలుగుముఖములు గల బ్రహ్మదేవునికైన తరముకాదు.) కావున ఏవిషయమునైనను గ్రహింపదలచువాఁడు మొట్టమొదట తనకు దగిన అధికారము కలదా? లేదా ? అని విచారించుకోన వలయును. ఆచార్యుండును తన్ను ఆశ్రయింపవచ్చిన శిష్యుఁడు ఉపదేశమునకు తగునా? తగడా? అని పరీక్షించి బోధించ వలయును. కావున ఈబ్రహ్మవిద్యయొక్క ఉపదేశమునకు పైఁజెప్పఁబడిన నిత్యానిత్య వస్తువివేకము మొదలగు నాలుగు సాధనములను సంపాదించినవాఁడే తగిన అధికారి. వానికి యజ్ఞాది కర్మలతోఁగాని, వానిసాధనములతోఁగాని, పనిలేదు. భేదజ్ఞానముకల సమయమునందుగాని, కర్మలను జేయుటకు వీలులేదు. ఈ అధికారియనినన్నో, జీవబ్రహ్మైక్యమును సామాన్యముగ విని దానిని నిశ్చయించుకోన వచ్చినవాఁడు. కావున వీనికి గర్మములతో పనిలేదనుట స్పష్టము.

ఇదియునుఁగాక వేదము కర్మకాండయందు కర్మలను విధించియుండియు జ్ఞానకాండమునందు వానిని నిషేధించుచు బ్రహ్మవిద్యాధికారియగువానికి కర్మలు అనావశ్యము లను విషయమును స్పష్టము చేయుచున్నది. ఈకారణమువలన పైఁజెప్పఁబడిన అధికారి కర్మలను వదలి పరమేశ్వరునియొక్క యథార్థస్వరూప స్వభావములను విచారింపవలయును. ఆబ్రహ్మము యథార్థస్థితిలో జీవునికంటె వేఱుకాఁడు. అయినను, ఈవిషయము కొంత అనుభవ విరుద్ధముగా ఉన్నట్లు గానవచ్చుటచేత ఇందుకలుఁగు సంశయములకు మితిలేదు. కావున పరమాత్మునియొక్క యథార్థస్వరూపమును అట్లే యుపదేశింప వల

యునని అది సంభవింపనేరదు. (స్వరూప లక్షణముతో బ్రహ్మ మును జెప్పుట అశక్యము.) ఈకారణమువలన బ్రత్యక్ష సిద్ధమగు బ్రపంచమును ఆశ్రయించియే మొట్టమొదట ఆపరమేశ్వరుని దెలిసికొనవలయును.

ఆచార్యుఁడును అట్లే తెలుపవలయును. ఏసర్వజ్ఞుని నుండి ఈప్రపంచము పుట్టుచున్నదో, ఎవ్వనియందు ఈప్రపంచము నిలిచి యున్నదో, ఎవ్వనియందు లయమగుచున్నదో, ఎవ్వనిచేత చక్కఁగ నిర్వహింపబడుచున్నదో, నాతఁడే పరమేశ్వరుఁడని శ్రుతి చెప్పుచు న్నది, (ఇదియే తటస్థ లక్షణము.) అధ్యారోపము. ఏసర్వజ్ఞుని వలన ధర్మాధర్మముల బోధించి లోకవ్యవహారములను నడపు సర్వశాస్త్రమయములగు వేదములు ఉద్భవించెనో, ఆతఁడే పరమేశ్వరుఁడని కూడ ఘోషించుచున్నది. (ఇదియును తటస్థలక్షణమే) ఏపరమే శ్వరునియొక్క స్వరూప స్వభావములను దెలిసికొనుటకు వేదముల కంటె ఇతరప్రమాణములు లేవు. ఆబ్రహ్మము ప్రత్యక్షమునకు గోచ రము కాదనుట స్పష్టమేకదా,

హేతువు ఏదియును లేకుండుటచేత అనుమానమునకుఁగూడ గోచరుఁడు కాఁడు. పొగయున్నచో అగ్నియుండవలయును, అను నట్లు ఏవస్తువుతోను బ్రహ్మమునకు సంబంధము చెప్పుట తటస్థింప దుకదా. ఇదియునుఁగాక ఆ ఈశ్వరునకు నామధేయము ఏదియును లేకుండుటచేతను, ఆయనతో సమానమగు రెండవ పదార్థమే లేకుం డుటచేతను, ఉపమానప్రమాణముచేత ఆయనను ఎఱుగుట సంభవిం పదు. ఇట్లే అర్థాపత్తి మొదలగు ఇతరప్రమాణములకుఁగూడ అమ్మ హాత్ముఁడు అగోచరుఁడు. కావున ఉపక్రమము (ఆరంభము) మొద లగు తాత్పర్య లింగముల (తాత్పర్యములను నిర్ణయించుటకు గురు తులు) సహాయముచేత వేదవాక్యములను విమర్శించి వానియందు జెప్పఁబడియున్న ప్రకారము పరమేశ్వరునియొక్క స్వరూప స్వభా వములను ఎఱుఁగవలయును. పిమ్మట యుక్తులచేత ఆవిషయ మును విచారించి మనస్సును దృఢము చేసికొనవలయును.

లోకమునందు రెండువిధములగు కారణములు గలవు. ఒకటి

ఉపాదాన కారణము. మఱియొకటి నిమిత్త కారణము. మట్టి కుండ యైనట్లే కారణము కార్యరూపమును జెందునో అది ఉపాదాన కారణము అనఁబడును. కార్యము జనించుటకు పూర్వమునగాని పిమ్మట గాని నశించిన తరువాతగాని ఈకారణమునకంటె భిన్నమగు రూపముతో నిలువనేరదు. నిమిత్త కారణమనగా, కార్యమునకంటె వేరై దాని యుత్పత్తికిమాత్రము సాధనమగుచు నుండునది. కుండకంటె వేరై దానిని జేయునట్టి కుమ్మరవాఁడు దానికి నిమిత్తకారణము, ఇకను ఈప్రపంచవిషయమునందు పైనవర్ణింపఁబడిన రెండు విధములగు కారణములును పరమేశ్వరుఁడేయని వేదము చెప్పుచున్నది.

"సోకామయత (అపరబ్రహ్మము జగత్తును సృష్టింప సంకల్పించెను)" అను మొదలగు వాక్యములచేత "పరబ్రహ్మము ప్రపంచమునకు నిమిత్త కారణము" అనియు "బహుస్యాం." (నేనే అనేక విధములు గలవాడను [ప్రపంచమును] అయ్యెదను,) అను మొదలగు వాక్యములచేత "పరబ్రహ్మము ప్రపంచమునకు ఉపాదానకారణము" అనియు బోధించు చున్నది. ఏశాఖయందు జూచినను ఇట్టివాక్యములు లెక్కకు మిక్కిలిగ గలవు. వేదమునకు ఇట్టి అభిప్రాయము ఉండుటచేతనే "ఈప్రపంచము ఎచ్చట బుట్టునో, నిలచునో, లయించునో, అదియే బ్రహ్మము" అని లక్షణమును జెప్పుటకు నవకాశము కలిగినది. ఏకార్యమైనను తన ఉపాదాన కారణముతో అభిన్నమై అందేబుట్టుచు నశించుచు నుండును గాని నిమిత్తకారణమునందు అట్లుండదుగదా. కావున ఈప్రపంచమునకు ఉపాదాన కారణము, నిమిత్తకారణముగూడ బ్రహ్మమే అనుట వేదసిద్ధాంతము.

మఱియు, ఛాందోగ్యోపనిషత్తునందు "ఉపాదాన కారణమగు మట్టిని దెలిసికొనిన దానినుండి పుట్టు ఘటాది మృణ్మయపదార్థములను ఎట్లు తెలిసికొనినట్లగునో అట్లే ఉపాదాన కారణమగు బ్రహ్మమును ఒక్కదానిని ఎఱింగిన చేతనాచేతనాత్మకమగు ఈసకల ప్రపంచమును తెలిసికొనినట్లగును." అని చెప్పఁబడి యున్నది. ఇదియు పైసిద్ధాంతమును దృఢపఱచు చున్నదిగదా. కావున ఏపురు

షుడు ఈప్రపంచమునకంటే వేఱుకాకుండియును ఇందలి వికారము లతో సంబంధపడక శుద్ధుడై ఉన్నాడో ఆతడే పరబ్రహ్మమని తెలి సికొనవలయును.

వేదము ఇట్టి అభిప్రాయము కలిగియున్నను అందలి వాక్య సందర్భములను బాగుగ సమన్వయించుకొననేరక సాంఖ్యాది మత కర్తలు బహువిధములగు పోకల బోయియున్నారు. " చేతన పదా ర్థము ఈప్రపంచమునకు ఉపాదాన కారణమైనచో ఇదికూడ చేత నమై యుండవలయును. జీవుడు ఒక్కడుతప్ప తక్కిన పదార్థములు అన్నియును అచేతనములుగా నున్నవికదా. ఇది ఎట్లు సంభవిం చును " అనునది వారలకుగల ప్రధానసంశయము. ఈసంశయమును తొలగించుకొననేరక వారలు వేదవాక్యములకు గొన్నిటికి అపార్థము చేసి తమతమ పక్షములనే వేదము వచించెనని చెప్పుచున్నారు.

" అణ్వ ఇమేధాన్యాః " (ఈవిత్తనములు మిక్కిలి సూక్ష్మ ములై ఉన్నవికదా) " అను మొదలగు వాక్యములందలి అణు శబ్దములను జూచి అచ్చటి సందర్భములను విచారింపక " పరమా ణువులు ప్రపంచమునకు ఉపాదానకారణము " అని వేదము అభి ప్రాయ పడుచున్నట్లు తార్కికులు తలంచుచున్నారు.

" అసద్వా ఇదమగ్ర ఆసీత్ (ఈప్రపంచము మొదట అసత్తుగా నుండెను ) " అను మొదలగు శ్రుతులను అనుసరించి అచ్చటి సంద ర్భములను విచారింపనేరక అసత్తనగా నామరూపములు ప్రకాశిం పని స్థితియే యని ఎఱుంగనేరక " శూన్యమే ప్రపంచకారణము " అని శూన్యవాదులు అనుచున్నారు.

" స్వభావమేకే ( కొందరు ప్రపంచమునకు స్వభావమే కార ణము అని అందురు. ) " అను పూర్వపక్షశ్రుతిని ఆశ్రయించియే స్వభావవాదులు తమ మతమే వేదమతమని వక్కాణించుచున్నారు.

వీరందఱికంటె ప్రబలులైన సాంఖ్యులు బ్రహ్మ ప్రతిపాదకము లగు వేదవాక్యములనుగూడ తమమతమునకు అనగా " ప్రధానమే జగత్కారణము " అను మతమునకును అనుకూలములనుగా జేయు చున్నారు. అది ఎట్లనిన, ఛాందోగ్యోపనిషత్తునందు "సదేవ సోమ్యేద

మగ్ర ఆసీత్ ( " ఓశాంతుడా, మొట్టమొదట ఈ ప్రపంచము సద్రూపముతో నుండెను ) " అని ఉపదేశించుటకు ఆరంభించి " తత్తేజోసృజత (ఆసత్పదార్థమే తేజోభూతమును పుట్టించెను) " అను మొదలగు వాక్యములచేత ఆసత్పదార్థమే సర్వ భూతములకును గారణము అని చెప్పి " సఆత్మా తత్వమసీ (ఆసత్పదార్థమే ఆత్మ. అదియే నీవు [జీవుడు] " అనిఉపదేశ సమాప్తి చేయబడి యున్నది. ఇట్లు ఈవాక్యము స్పష్టముగ చేతన పదార్థమునుగూర్చి చెప్పుచున్నను సాంఖ్యులు విచారశూన్యులై " ఈసందర్భమునందు ప్రధానమునుగూర్చియే చెప్పబడియున్నది. అని చెప్పుదురు. సచ్ఛబ్దమునకు ప్రధానమే అర్థమనియు, నిర్వికారుడగు పరబ్రహ్మము కార్యములను జేయనేరదు, కావున సత్వ రజ స్తమోగుణ రూపిణియగు ప్రధానమే జగత్కారణము గావలయుననియు, వారి అభిప్రాయము. ఇంతయేకాని " తత్త్వమసి " అనువాక్యమునందు ఉన్న తచ్ఛబ్దమునకుగూడ సచ్ఛబ్దముతో జెప్పబడిన పదార్థమే అర్థముకాదా యనియు, అచేతనమగు ప్రధానమే సచ్ఛబ్దముచే జెప్పబడెను అనినయెడల దానికిని చేతనుడగు జీవునకును ఐక్యము సంభవింపదనియు, కావున ఇది వాక్యసందర్భమునకు విరుద్ధమనియు, వారు కొంచెమైనను దలంపరు.

కావున వివేకియగు అధికారి విరుద్ధ మార్గములను అవలంబింపక శాంతచిత్తుడై వేదవాక్యములను బాగుగ సమన్వయింపవలయును. ఒక ప్రకరణమును విచారింప నారంభించినప్పుడు "దీనిని ఎట్లు ఆరంభించిరి? ( ఉపక్రమము ) ఎట్లు ముగించిరి? (ఉపసంహారము) పూర్వము జెప్పబడియున్న విషయములకును ప్రస్తుత విషయమునకును భేదమేమి? ( అపూర్వత ) ఈవిషయమును గ్రహించిన ఏఫలముకలుగునను అనిచెప్పియున్నారు? (ఫలము) దీనిని ఎఱింగిన ఇదియే ఫలము కలుగుననుటకు ప్రమాణమేమి? ( ఉపపత్తి ) ఈవిషయమును గూర్చి ఆచరింపబడిన స్తోత్రము ఏయభిప్రాయము నిచ్చుచున్నది? (అర్థవాదము) ఈప్రకరణమునందు దేనినిగూర్చి పలుమారు చెప్పబడియున్నది? ( అభ్యాసము ) అను విషయములనుగూర్చి మిక్కిలి సూక్ష్మముగ విచారింపవలయును. అట్లు విచారించిన ఆప్రకరణము

నందలి తాత్పర్యము స్పష్టముగ గోచరమగును. (ఇట్లు ప్రమాదము లేక ఉపనిషత్తులనెల్ల పరిశోధించినచో నిశ్చయముగ పరబ్రహ్మమే ప్రపంచమునకు అభిన్న నిమిత్తోపాదాన కారణమని స్పష్టమగును. ఇదియే సిద్ధాంతము. దీనికి ఎట్లును లోపము లేదు.

ఇట్లు చేతన పదార్థమే జగత్తునకు ఉపాదానము అనినయెడల విరోధము వచ్చుట తప్పదు. కార్యమునకు కారణగుణములు అవశ్యముగ నుండవలయును గదా. అని ఆక్షేపింప నవసరము లేదు. (లోకమునందు చేతనుడగు మనుష్యునినుండి గోళ్లు వెంట్రుకలు మొదలగు అచేతన పదార్థములు జనించుటయును, అచేతనములగు పేడము దలగు వానినుండి చేతనములగు పురుగులు జనించుటయు మనము చూచుచున్నాము.) కావున ఇది యొకదోషము కాదు. బ్రహ్మము అద్వితీయుడు కదా, ఆయన ఉపాదాన కారణముగా నున్నప్పుడు ఈప్రపంచమంతయు నొకటిగనే ఉండవలయునుగాని అనుభవించువాడు, అనుభవింపబడునది, అను మొదలగు భేదములు ఉండకూడదు కదా, అనియెదవేమో అందేమియు విరోధము లేదు. లోకమునందు మట్టి యొక్కటియే ఉపాదాన కారణముగా గలవియైనను కుండ, చట్టి, ముంత, మొదలగునవి పరస్పర భిన్నములైనట్లు ఈప్రపంచమునందలి సర్వ వ్యక్తులకును పరబ్రహ్మము ఒక్కడే కారణమైనను వానికి భేదము కలుగవచ్చును. కావున పైసిద్ధాంతము ప్రత్యక్షమునకు విరుద్ధమని సంశయింప నక్కఱలేదు. ఇట్టి కల్పితభేదము ఉండుటచేతనే జీవబ్రహ్మలు పరమార్థస్థితిలో ఒక్కటియే అయినను ప్రపంచమునకు పరబ్రహ్మము ఉపాదానకారణమని చెప్పిన జీవుడు ఉపాదాన కారణమని చెప్పినట్లే అయినను దోషము ఏమియును రాదు. "(జీవుడే ప్రపంచమునకు కారణమైన యెడల తనకు అనిష్టమగు జరా మరణాదులను దానే సృజించుకొనునా" అనునది ఒక గొప్ప సంశయము కదా.) పైన జెప్పిన హేతువువలన నీసంశయము కలుగ కూడదు, భూమినుండియే జనించినవైనను కెంపు, పగడము, ముత్యము, మొదలగునవి నానావిధములగు వైచిత్ర్యములు

కలిగియుండునట్లు జీవబ్రహ్మలుగూడ అభిన్నులయ్యును ఉపాధి భేద మువలన అనేక వైచిత్ర్యములు కలవారలై ఉండవచ్చునుకదా ?

మఱియును ఈపరబ్రహ్మము స్వయముగానే ప్రపంచరూపమును జెందునేగాని సాధనాంతరములను అపేక్షింపదు. లోకమునందు పురుషుడు ఏదియైన నొక కార్యమును సాధింప వలయుననిన వానికి బాహ్య సాధనములు కావలయునుగాని పాలు పెరుగుగ మారవలయుననిన, అవి అక్కఱలేదనుట ప్రత్యక్ష సిద్ధమేకదా.

ఇచ్చట ఒకవిషయమును బాగుగ తెలిసికొన వలయును. ఏదియైనను ఒకవస్తువు పుట్టవలయుననిన దాని జన్మమునకు ఆరంభమనియు, పరిణామ మనియు, రెండుకారణములు గలవని తార్కికులు జెప్పుదురు. నూలు గుడ్డయైనట్లు కొన్ని పదార్థముల చేరిక ఒక పదార్థమును బుట్టించినయెడల నది ఆరంభము. పాలు పెరుగైనట్లు ఒక వస్తువు స్వయముగా మార్పు జెంది మఱియొక వస్తువును కలిగించుట పరిణామము. ఈతార్కిక మతమును అనుసరించి చూచిన బ్రహ్మ జగద్రూపముతో పరిణమించునని చెప్పవలసి వచ్చును.

వేదాంతి మతము మాత్రము ఇట్టిది కాదు. వానికి వివర్తమను మఱియొక కారణముకూడ గలదు. త్రాడును జూచి భ్రాంతిచేత పామని తలంచునట్లు ఒకవస్తువును మఱియొక వస్తువుగా జూచుటవలనగూడ ఒకపదార్థము పుట్టవచ్చును. త్రాడును పామని భ్రమించినప్పుడు అచ్చట పాము ప్రత్యక్షముగనే పుట్టును. అట్లు భ్రమించినవాడు ప్రత్యక్ష సర్పమును జూచినవానివలె భయమును జెందుటయు, వణకుటయు, దానిం గొట్ట ప్రయత్నించుటయు అది తన్ను కరచినట్లు భ్రమించినవాడు ప్రత్యక్ష విషవేగమువలన గలుగు వికారములను జెందుటయుగూడ కలదు. ఇదియే వివర్తము ("పాదోస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతందివి ( ఈ పరబ్రహ్మములోని ఒక భాగము ప్రపంచము. మూడు భాగములు ప్రపంచమునకు అతీతము అగు తత్వము ) అనిచెప్పుచు శ్రుతియే పరబ్రహ్మవివర్తమే ప్రపంచము " అని బోధించు చున్నది.) పరిణామమైనచో పాలు నిశ్శేషముగ పెరుగగునట్లు బ్రహ్మము నిశ్శేషముగ ప్రపంచరూపుడు

కావలయునుగాని కొంత ప్రపంచరూపముతోను మఱికొంత శుద్ధముగాను నిలచుటకు వీలులేదు. వివర్తమైనచో ఇట్లు కానక్కఱలేదు. రజ్జువు మిక్కిలి పొడవైయుండెనేని విమర్శాశూన్యుఁ డగువానికి ఒక అంశమునందుమాత్రమే సర్పభ్రాంతి కలిగినను కలుగవచ్చునుగదా.(కావున వేదవాక్యానుసారముగా నీప్రపంచము బ్రహ్మవివర్తమే అని సిద్ధాంతము చేయబడి ఉన్నది.)

పరబ్రహ్మమును తెలిసికొనుటకు వేదముతప్ప మఱియొక ఆధారము లేదని ఇదివరకే చెప్పియున్నాముగదా. ఈకారణమువలన బ్రహ్మ ప్రపంచరూపుడుగా పరిణమించుననిగాని ఆయనకు అవయవములు కలవనిగాని చెప్పకూడదు. పరబ్రహ్మమునకు అవయవములు లేవని చెప్పు వేదము అప్పుడు నిరర్థకము అగును. సర్వశ్రుతులను సమన్వయింప వలయునుగాని కొన్ని శ్రుతులను నిరర్థకము చేసిన ఆసిద్ధాంతము అప్రమాణము అగునుకదా. ఇట్లే " సర్వకర్మ సర్వకామ ( సర్వకార్యములను చేయునట్టి శక్తికలవాడు ) " అని శ్రుతియందు చెప్పబడియుండుటచేత మాయాశక్తి ఆ బ్రహ్మమును ఆశ్రయించి ఉన్నదనినను దోషములేదు. ఆయన అద్వితీయుఁడైనను అగ్నియందలి ఉష్ణశక్తివలె ఆమాయాశక్తియును ఆయనకంటె వేరైనదికాదు. కావున విరోధము ఏమియును ఉండదు.

" ఇట్లు ప్రపంచమును సృజించుటవలన ఆ పరబ్రహ్మమునకు ప్రయోజనము ఏమియును లేదుకదా. ఇట్టి పనియందు ఆయన ఏల ప్రవర్తించెను " అనరాదు. లోకములో ప్రభువులగువారు ప్రయోజనమును గోరకయే విలాసార్థమై అనేక కార్యములను చేయుట చూచుచున్నాము. ఉచ్ఛ్వాసము, నిశ్వాసము, మొదలగునవి తమకు ఏమియు బ్రయోజనము లేకున్నను స్వభావముగా కొన్నికార్యములను ఆచరించు చుండుటను చూచుచున్నాము. ఇట్లే పరబ్రహ్మముకూడ తనకు ఏమియు ప్రయోజనము లేకున్నను ప్రపంచమును సృజించుననిన విరోధము ఏమికలదు.

ఇదియునుగాక సృష్టిలో ఎన్నిభేదములు కనబడుచున్నను కొందఱు సుఖులుగాను మఱికొందఱు దుఃఖులుగా ఉన్నను, పరమేశ్వ

రునకు విషమత్వము సిద్ధింపదు. జీవ పరమాత్మలకు కల్పిత భేదము కలదని ఇదివరకే చెప్పియున్నాముకదా. కర్మ అనాది కావున, అనాదికర్మను ఆశ్రయించి ఈశ్వరుడు బహువిధములగు విచిత్ర ఫలములను ఇచ్చుచుండును. తప్పులు లేకుండినను, ఒకరిని శిక్షించుచు, మఱియొకరిని రక్షించుచును ఉండినకదా పక్షపాత మగును. అట్టి గుణము లేకుండుటచేత పరమేశ్వరుడు పక్షపాతి కానేరడు. కర్మలను ఆశ్రయించినంతమాత్రమున పరబ్రహ్మమునకు స్వతంత్రత్వము పోదు. అనేక సేవకులుగల ప్రభువు తన్ను ఏయే సేవకుడు ఎట్లెట్లు సేవించునో ఆయా సేవను బట్టి వారలకు ధనమును ఇచ్చును. ఇప్పుడు ఆరాజు జీతములను ఏర్పఱచు విషయములో సేవకులు చేసిన కర్మలను ఆధారముగా జేసికొనియే ఉన్నాడుకదా. ఇంతమాత్రము చేత ఆప్రభువుయొక్క ప్రభుత్వమునకు భంగము కలిగెనా ? కావున పరబ్రహ్మ విషయమునుకూడ ఇట్లే గ్రహింపవలయును. ఈవిధముగా ఎన్నియుక్తులతో విమర్శించి చూచినను పరబ్రహ్మము ఒక్కడే ప్రపంచమునకు ఉపాదాన నిమిత్త కారణములుగా ఉన్నాడనుటలో విరోధము ఏమియును లేదు.

సాంఖ్యయోగాది మతములలో వేదవిరుద్ధములగు " అచేతనమగు ప్రధానమే జగత్తునకు ఉపాదాన కారణము. పరమేశ్వరుడు నిమిత్త కారణము. జీవుడు అణు స్వరూపుడు, లేక, శరీరమంత పరిమాణము గలవాడు, లేక, సర్వవ్యాపకుడైనను, ప్రతి శరీరమునందును వేరువేరుగా ఉన్నాడు. పరబ్రహ్మమునకంటె వేరు " అను మొదలగు భాగములు తప్ప తక్కిన భాగములను అంగీకరింపవచ్చును. అందు ఉపదేశింపబడిన విధానములను అనుష్ఠింప వచ్చును. చార్వాకాది మతములను గొన్నిటిని ఆస్తికులగువారు సంపూర్ణముగ బరిత్యజింప వలయునుగాని ఆయామతస్థులు మాత్రము తగినంత విశ్వాసము లేనిది పరుల బోధలచే బలాత్కారముగ విడువరాదు. ఏమతమును ఆశ్రయించియున్నను అందలి ధర్మములయందు మిక్కిలి శ్రద్ధాళువై యుండెనేని క్రమక్రమముగ తగినంత చిత్తశుద్ధిని జెంది వేదనిష్ఠను ఆశ్రయించి ముక్తుడగును. సందియము లేదు.

ప్రకృతము చేతనాచేతన రూపమగు ఈ సకల ప్రపంచముల కును పరబ్రహ్మమే ఉపాదాన కారణమని చెప్పబడి ఉండుటచేత అజ్ఞాన కల్పితములగు భేదములు ఎన్నియున్నను ప్రపంచ బ్రహ్మము నకు భేదము లేదు. మట్టి ఉపాదాన కారణముగాగల ఘటాదులలో గల్పిత భేదములు ఎన్ని యున్నను, అవి మట్టికంటె వేరుకావుగదా. ఇదియునుగాక బ్రహ్మవివర్తమే ప్రపంచమని చెప్పుటచేత రజ్జుసర్పము లకు పరస్పర భేదము లేనట్లు ప్రపంచ బ్రహ్మలకు బొత్తిగనే భేదము కలుగనేరదు. ఇట్లగుటచేత చేతన ప్రపంచమని వ్యవహరింపబడు జీవునకును, బ్రహ్మమునకును, భేదములేదని మఱియొకమారు చెప్ప నక్కరలేదు గదా, ఎన్నిమతస్థులు ఎన్నివిధములుగా ఆక్షేపించినను, వేదాంత సిద్ధాంతమునకు లేక, వేదసిద్ధాంతమునకు అనగా బ్రహ్మమే జగత్తునకు కారణమను సిద్ధాంతమునకు ఏవిధమగు భంగమును రాలే దని ఇదివరకే తెలిసికొని ఉన్నారు. ఒక్కడు ఒక్కవిధముగా యుక్తు లను జూపి సిద్ధాంతము జేసినా, మఱియొకడు మఱియొక విధముగా యుక్తులను జూపి దానిని ఖండించు చుండును. కావున వేదమును ఆశ్రయింపక కేవల యుక్తి సిద్ధములగు సిద్ధాంతములు ఎప్పటికిని స్థిరములు కానేరవు. గనుక (వేదమును ఆధారముగా జేసికొని ఒనర్ప బడిన వేదాంత సిద్ధాంతమే ముముక్షువులచేత ఆదరణీయమైనది) కర్మ ఫలములు నశ్వరములు. వానిని ఆశ్రయించిన ముక్తి దొరుకదు. కావున వివేకముకలిగి ఇహ, పర, భోగముల యందలి ఆశ వదలి మోక్షమునుగూర్చి ప్రయత్నింప వలయును.

ఆ మోక్షము స్వభావసిద్ధమేకాని, స్వర్గాదులవలె కర్మల సహాయముచేత సంపాదింప వలసినది కాదు. పైన నిరూపించినట్లు గా జీవునికంటె వేరుకాదని చెప్పబడిన పరబ్రహ్మమే మోక్షము. ఇట్లు స్వస్వరూపమైయున్న మోక్షరూప శాశ్వత ఆనందమును విడచి బహు ప్రయాస సాధ్యములగు కర్మలచేత సంపాదింప తగిన క్షణిక మగు స్వర్గసౌఖ్యము గోరుట ఎంత వెఱ్ఱితనము.

జీవుడు దుఃఖియనియు, సంసారియనియు, అతనికిని బ్రహ్మ మునకును భేదము కలదనియు తలచుట భ్రాంతి. అది యెట్లనిన;—

లోకములో ప్రతిపురుషుడును "నేను, నేను" అని వ్యవహరించుకొనుచున్నాడు. అచేతనము లగుటచేత శరీరముమొదలు బుద్ధివఱకు గల పదార్థములు ఏవియును ఈ అహంశబ్దమునకు అర్థములు కానేరవు.(చేతనస్వరూపుడును, సర్వసాక్షియునగు జీవుడే దానికి అర్థమగును) జాగ్రత స్వప్నావస్థలయందు దోచు పదార్థముల నెల్లను ఈజీవుడే చూచుచున్నాడు. సుఖ దుఃఖాదులన్నియును ఆజీవునికే గోచరములు అగుచున్నవి. ఇట్లుండగ జ్ఞానరూపుడై సాక్షియై (తమ్ముజూచువాడై) యుండు జీవుని సాక్ష్యమగు (చూడబడునదియగు) దుఃఖము ఎట్లు ఆశ్రయింప గలదు. చూచువానికంటె చూడబడునది అవశ్యము వేరై యుండవలయును గదా, కావున "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ (పరబ్రహ్మము సత్యస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు అనగా సర్వసాక్షి, నాశరహితుడు)" అను మొదలగు శ్రుతులయందు వర్ణింప బడియున్న బ్రహ్మమునకంటె ఈతడు వేరుకానేరడు. సాక్షిగానుండుట, జ్ఞానరూపుడైయుండుట, సుఖదుఃఖాలతో సంబంధపడకుండుట, అను ధర్మములు సమానముగా నున్నప్పుడు వస్తువునకు మాత్రము భేదము కలదని ఏల చెప్పవలయును? ఎట్లు చెప్పవచ్చును? అది సర్వప్రమాణములకును విరుద్ధమగును కదా, కావున జీవబ్రహ్మలు ఒక్కటి యనుటయే (ఇదియే స్వరూపలక్షణము, అపవాదము, అనగా, ప్రపంచమును నిరాకరించుట) వేదాభిప్రాయము. కొన్నిస్థలములయందు శిష్యులకు సుఖబోధ చేయుటకై వారికిగల భేదజ్ఞానమును అవలంబించి భేదమును బోధించిరేగాని అవియే పరమార్థమను ఉద్దేశముతోగాదు. అట్లే యైనచో అభేద శ్రుతులు అప్రమాణములు కావలసి వచ్చును. సంపూర్ణముగ వేదమును అధ్యయనము చేయవలయునని చెప్పుటచేత ఇది (కొంతభాగము అప్రమాణమగుననుట) యసంభవము కదా, కావున భేదజ్ఞాన (అజ్ఞాన) మున్నంతకాలము ఘటాకాశ మహాకాశమునకువలె జీవబ్రహ్మలకు భేదము తోచుచున్నదేకాని, వేఱేమియులేదు.

బ్రహ్మయందు అభిన్నముగానున్నదని చెప్పబడిన ప్రకృతియే పరబ్రహ్మమును ప్రపంచముగా దోచునట్లు చేసినది. కావున నదియే

వుని యుపాధి ప్రకృతి యన్నను అజ్ఞానమన్నను ఒక్కటియే. కా
గున జ్ఞానముచేత ఆయుపాధి నశించిన జీవుడు స్వస్వరూపమున జేరు
ు. చేరుననుట యేల? తెలిసికొనలేక పోవుట ఒక్కటియేగాని, ఎప్ప
కిని జీవుడు పరబ్రహ్మముగానే యున్నాడుకదా. త్రాటియందు
ాంతిచేత తోచినపాము ఆత్రాటికంటె వేరుకానట్లు చేతనాచేత
ాత్మకమగు ఈప్రపంచమంతయును బ్రహ్మవివర్తమగుటచేత యథా
స్థితిలో ఆబ్రహ్మమునకంటె వేరైయుండుటకే వీలులేదు కదా.

కావున తగిన అధికారముగలవాడు వేదాంతములు ( ఉపని
షత్తులు ) జీవబ్రహ్మైక్యమును బోధించునని ఎఱిగి చక్కగ సమన్వ
యించి జ్ఞానమును సంపాదించి సర్వానర్థకారణమగు అవిద్యను తొ
లగించి మోక్షమును జెందవలయును. మోక్షమును జెందుటకు జ్ఞాన
మునకంటె వేఱొకసాధనము లేదు. వేదభాగములగు ఉపనిషత్తులను
విచారము చేయవలసి యుండుటచేత వేదాధికారములేని శూద్రునికి
ందు అధికారము లేదు. వాడు జ్ఞానసాధనములగు భక్తియోగాదు
లలో ప్రవర్తించి చిత్తశుద్ధిని అభివృద్ధి చేసికొనవలయును. ముము
క్షువగువానికి జన్మాంతరమునందైనను ముక్తి దొఱకక మానదు.
తగిన అధికారము గలిగి ముక్తిని జెందినవాడు మరల జన్మింపడు.)

(పైన వర్ణింపబడిన అపరోక్షజ్ఞానము కలిగినవారు సహితము
దానిని దృఢము చేసికొనుటకై పలుమాఱు "అహంబ్రహ్మాస్మి"
అని ధ్యానము చేయుచుండవలయును) కావున తగినంత అధికారము
ఉండియు ఏదియో యొక ప్రతిబంధవశమున అపరోక్షజ్ఞానము కలు
గనివారు పరబ్రహ్మమును ధ్యానించుట ముఖ్యమని వేఱుగా జెప్ప
నక్కరలేదుకదా, పరబ్రహ్మమును ధ్యానింపవలయుననిన ఆయన
నిర్గుణుడు, స్వస్వరూపమునకంటె అభిన్నుడు, కావున ఆయనను
ధ్యానముచేయుట అసంభవము. ఐనను సద్గురూపదేశమువలన పర
బ్రహ్మతత్త్వమును ఎఱిగినవాడు ఆయనను ఏదియో యొక ఆలంబ
నముతో ( ఉపాధితో ) గూర్చి ధ్యానించినను లోపములేదు. తన
కును ఆయనకును భేదము కలదని వాడు ఎప్పటికిని తలంపడు కదా.
ఈ అభిప్రాయముచేతనే సగుణోపాసన అనబడు విష్ణ్వాది పూజల

యందు గూడ (" హృదయేచ విసర్జయేత్ తన హృదయమునందు న్న దేవతను విగ్రహముపై ఆవాహనముజేసి పూజించి మఱల హృ దయములోనికి ఉద్వాసన చేయవలయును ") అని శాస్త్రమునందు చెప్పబడియున్నది. (" అథయోఽన్యాం దేవతా ముపాసతే ఽన్యో సావన్యోఽహమస్మీతిన స వేద స పశుః) ఎవడు తాను వేఱు దేవత వేఱు అను అభిప్రాయముతో ఉపాసన జేయునో వాడు పశువుతో సమా నుడు " అను మొదలగు శ్రుతులుకూడ ఈవిషయమునే నొక్కి చెప్పు చున్నవి. కావున సగుణ నిర్గుణోపాసకులను రెండు తెఱగులవారును అభిప్రాయము సమానమైనచో సమానులే అగుదురు. ఆలంబనమును గ్రహింపవలయుననిన పిమ్మట దేహాలంబనమైనను బుద్ధ్యాది రూప ఆలంబనమైనను ఒక్కటియే కదా.

శ్రద్ధాళువులైన ఉపాసకులు తమ జీవితకాలమునందు అప రోక్ష జ్ఞానమును జెందకపోయినను అర్చిరాది మార్గమును అవలం బించి బ్రహ్మలోకమును జేరి కల్పాంతమువఱకును అచటనుండి అప రోక్ష జ్ఞానవంతులై ఆచతుర్ముఖునితోకూడ ముక్తిని చెందుదురు. హృదయమునందున్న నూఱునాడులలో ప్రధానమైయున్న బ్రహ్మ నాడీమూలమున ఆజీవులు నిర్గమింతురు. పిమ్మట వారిని అగ్ని తనలో కమునకు గొనిపోయి అచ్చటనుండి జ్యోతిర్లోకమునందు చేర్చును. అచ్చటినుండి క్రమముగ ఆయా లోకాధిపతులచేత గొనిపోబడుచు ఉత్తరాయణాభిమాని దేవతయొక్క లేక చంద్రునియొక్క లోకమున ఆయుపాసకుడు జేరును. బ్రహ్మలోకమునుండి ఒక సిద్ధపురుషుడువచ్చి అచ్చటనుండువారిని తనలోకమునకు గొనిపోవును. ఇట్లు ఉపాసకులు బ్రహ్మలోకమును జేరి క్రమముగ ముక్తులగుదురు. ఇదియే క్రమ ముక్తి అనబడును.

ఇట్టి ఉపాసనను ఆశ్రయింపక కర్మలను ఆచరించు వారికి ముక్తిలేదు. వారు ( కర్మలను ఆచరించునట్టి జీవులు ) ఏదియో ఒక నాడీద్వారా నిర్గమింతురు. అట్లు నిర్గమించి ధూమలోకమునుండి రాత్రిలోకమునకును అచటినుండి కృష్ణపక్ష లోకమునకును పిమ్మట దక్షిణాయన లోకమునకును పోయి అచటినుండి చంద్రలోకమునకు

బోయి కర్మఫలమును అనుభవించి మఱల భూలోకమునకు వత్తురు. అట్లు వచ్చునపుడు మొదట ద్యులోకమునందు (ధూమలోకము మొదలు దక్షిణాయన లోకమువఱకు గల లోకములయందు) ను అచ్చటినుండి చంద్రలోకమునందును మేఘములయందును భూమియందును ఓషధులయందును పురుషునియందును స్త్రీయందును క్రమముగ నిలచి జన్మింతురు. కొన్నిజీవులు ద్యులోకాదులగు నీసర్వస్థలములయందును ఉండక గొన్నిటియందు మాత్రమే నిలచుటగూడ కలదు. అశుభకర్మలను ఆచరించువారలకు ఈ అవస్థయే లేదు. పుట్టుట చచ్చుట, అనునవియే వారిపని. జీవులందఱిని సామాన్యముగ స్థూల శరీర నిర్మాణ సాధనములగు పంచీకృత భూతములతోడనే కొనిపోవుదురు. అవి బ్రహ్మజ్ఞానికిని ఉపాసకునకును విదేహముక్తిపర్యంతము నిలచియుండును. కర్మఠునికి బ్రహ్మజ్ఞానము కలుగునంతవఱకును ఉండవలసినదియే. కావున ప్రతిజన్మమునందును అనువర్తించి వచ్చుచుండును.

కావున వివేకియగువాడు భేదబుద్ధివలన గలుగు కష్టములను ఎఱిగి ఐహిక ఆముష్మిక సుఖములయందు విరక్తుడై సద్గురువును ఆశ్రయించి తత్ప్రసాదమువలన జీవన్ముక్తిని సాధింప బ్రయత్నింపవలయును. జీవన్ముక్తి అనగా స్వస్వరూపమును దెలిసికొనుటయే. కావున కష్టసాధ్యముకాదు. తన్ను దాను తెలిసికొనుట ఏమికష్టము. కావున ఈ అభిప్రాయమును ఎఱిగి వివేకదృష్టిగలిగి శాశ్వతముగ పరమానంద సుఖమును అనుభవింతురుగాక. జన్మాంతర సుకృతవిశేషముచేత దేవజన్మము గలుగును. స్వర్గలోకమునందు పుణ్యానుభవ సుఖమే అధికముగానుండును. అట్లు సుఖము అధికముగా నుండుట వలన భగవంతుని ధ్యానించుట సంభవింపదు. "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" అను శాస్త్రప్రకారము పుణ్యానుభవము ముగిసినవెంటనే మఱల మనుష్యజన్మమే ఎత్తవలసియున్నది. జన్మము గలిగెనేని మరణము సిద్ధముగనున్నది. కావున పుట్టుచు సుఖదుఃఖములను అనుభవించుచు చచ్చుచు నుండవలసి యున్నది.

పాపకార్యములను చేయువారు పశుపక్ష్యాది తిర్యగ్జన్మము

లను ఎత్తుచున్నారు. అతిర్యగ్జన్మములలో పుణ్యకార్యములను జేసి మంచిగతిని జెందుటకు జ్ఞానము ఉండదు. కాబట్టి మనుష్యుడు ఈమనుష్యజన్మములో సద్గతినిబొందుటకు అధికముగ బ్రయత్నమును జేయవలయును. ఈ మనుష్య జన్మమును వ్యర్థముజేసి కష్టించి సంపాదించి ద్రవ్యమును దంభాహంకార యుక్తులై లోకసుఖముల కొఱకును, శరీరమును అలంకరించుకొనుట కొఱకును, సెలవుచేసి వ్యర్థపరుపగూడదు. మనుష్యజన్మమును బోగొట్టుకొనిన ఇక మనకు ఏజన్మము గలుగునో అను భయము గలిగి ద్రవ్యమును నిష్కాములై భగవదర్పణముగా ధర్మకార్యములయందు వినియోగింపవలయును. పిమ్మట అజ్ఞానము వదలి చిత్తశుద్ధి కలుగును. చిత్తశుద్ధి కలిగినతోడనే సద్గురువును (ఆశ్రయించి బ్రహ్మసూత్రములు, జ్ఞానవాశిష్ఠము, పంచదశీప్రకరణము, భగవద్గీతలు) మొదలగు వేదాంత గ్రంథములను జదివి బ్రహ్మతత్వమును దెలిసికొనవలయును. అట్లు పరమాత్మ తత్వమును తెలిసికొని సర్వేశ్వరుదును, సర్వవ్యాపకుడును, సర్వాధారుడును, స్వప్రకాశుడును, సర్వపరిపూర్ణుడును, నిర్మలుడును సర్వకాలములయందును, ఏకరూపముతో నుండువాడును, సచ్చిదానంద స్వరూపుడునునగు పరబ్రహ్మను స్వానుభవముచేత ఎఱుగ . వలయును. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అను వేదవాక్యప్రకారము బ్రహ్మమును ఎఱిగినజ్ఞాని బ్రహ్మమే అగును. బ్రహ్మజ్ఞానము గలవానికి సకలపాపములు నశించును. జన్మ, జరా, మరణ, దుఃఖములు కలుగవు. పునర్జన్మ రహితమగు మోక్షము గలుగును. "ఉభేవిద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి" బ్రహ్మవేత్త పుణ్యపాపములను రెంటిని దులిపివేసి నిరంజనుడై పరబ్రహ్మతో ఐక్యమగును.) "జ్ఞానీత్వాత్మైవమేమతమ్" బ్రహ్మజ్ఞానముగల జ్ఞానినేనే అతడు. అతడేనేను. అని భగవంతుడగు శ్రీకృష్ణమూర్తి పలికెను. కావున మానవుడు బ్రహ్మజ్ఞాని అగుటకు బ్రయత్నించుట మిక్కిలి శ్రేయస్కరము.

ఓం తత్సత్.

శ్రీరస్తు.

# అష్టాంగయోగములు.

1 యమము, 2 నియమము, 3 ఆసనము, 4 ప్రాణాయామము, 5 ప్రత్యాహారము, 6 ధారణము, 7 ధ్యానము, 8 సమాధి, ఈయెనిమిది అష్టాంగ యోగములని చెప్పబడును.

(1) యమము. యమములు పదివిధములు. శ్లో ॥ అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయార్జవమ్ । క్షమా ధృతి ర్మితాహారః శౌచంచైవ యమాదశ॥ అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, దయ, ఆర్జవము, క్షమ, ధృతి, మితాహారము, శౌచము.

[1] అహింస. అనగా:— శ్లో ॥ కాయేన మనసా వాచా హింసాహింసా నచాన్యథా॥ మనోవాక్కాయములచేత సమస్తభూతములకును అనావశ్యకముగ అపకారమునుగాని, హానినిగాని, కలుగజేయకుండుట. సూ॥(తత్సన్నిధౌ వైరత్యాగః॥) ఈఅహింసను ఆచరించుట వలన క్రూరజంతువులు తమ స్వభావమగు వైరమును విడిచియుండును.

[2] సత్యము. అనగా:— శ్లో॥ చక్షురాదింద్రియైర్దృష్టం శ్రుతం ఘ్రాతం మునేశ్వర । తస్యైవోక్తి ర్భవేత్సత్యమ్ ॥ తాను చూచిన, వినిన, ఆఘ్రాణించిన, విషయమును ఉన్నవి ఉన్నట్లు తెలుపుట. సూ॥(సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్॥) ఈసత్యమును ఆచరించుటవలన యాగాదికర్మలు చేసినవారికి గలుగు ఫలము కలుగును.

[3] అస్తేయము, అనగా:— శ్లో ॥ అన్యదీయే తృణేరత్నే కాంచనే మౌక్తికేపిచ । మనసా వినివృత్తిర్యా తదస్తేయం విదుర్బుధాః ॥ మనోవాక్కాయములచేత ఇతరుల ద్రవ్యమును తృణముగా

భావించి నిస్పృహ కలిగియుండుట. సూ॥ (అస్తేయప్రతిష్ఠాయాంసర్వ రత్నోపస్థానమ్ ॥) ఈ అస్తేయమును ఆచరించుటవలన లోకమునందలి ఉత్తమవస్తుప్రాప్తి తనంతట ప్రాప్తించును.

[ 4 ] బ్రహ్మచర్యము. అనగా:—శ్లో॥ కాయేన మనసా వాచా స్త్రీణాంచ పరివర్జనమ్ । ఋతౌభార్యాం తదాతస్య బ్రహ్మచర్యం తదుచ్యతే ॥ పరస్త్రీలను విషయాసక్తితో దలంపకుండుట; ఋతుకాలములయందు స్వభార్యతో సంభోగించుట, తక్కిన కాలములయందు నిషిద్ధము. గురువులవద్ద బ్రహ్మవిచారణ చేయుట. సూ ॥ (బ్రహ్మచర్యప్రతిష్ఠాయాంవీర్యలాభః ॥) ఈ బ్రహ్మచర్యమును ఆచరించుటవలన శరీరేంద్రియ మనస్సులయందు సర్వకార్యకరణ సామర్థ్యము గలుగును. నిషిద్ధమగు స్త్రీసంభోగము చేయకుండుటయే శ్రేష్ఠమైన బ్రహ్మచర్యము.

[ 5 ] దయ. అనగా:—సకల భూతములయందును కరుణ కలిగియుండుట.

[ 6 ] ఆర్జవము. అనగా:—విహితము, అవిహితములైనవారలయందు ప్రవృత్తి నివృత్తులలో ఒకేవిధముగ నడుచుకొనుట.

[ 7 ] క్షమ. అనగా:— తన్నుబాధపెడి వారలయందును, నిందించువారలయందును, ప్రియాప్రియ వస్తువులయందును, మనోవికారము జెందకుండుట.

[ 8 ] ధృతి. అనగా:— తనకళత్ర, పుత్ర, మిత్రాదులకు వియోగము గలిగినప్పుడును, ద్రవ్యమునష్టమైనకాలమందును, దుఃఖించక మనోధైర్యము గలిగియుండుట.

[ 9 ] మితాహారము. అనగా:—ఉప్పు, పులుసు, కారమును వర్జించి తైలసంబంధమైన మధుర రసములతో గూడిన పదార్థములను మితముగ భుజించుట.

[ 10 ] శౌచము. అనగా:—బాహ్యశౌచము, అంతశ్శౌచము, అని రెండువిధములు. శరీరమాలిన్యమును మృత్తికచేతను, జలము చేతను, శుద్ధిపఱచుకొనుట బాహ్యశౌచము. సద్గురువును ఆశ్రయించి వేదాంతవిద్యను అభ్యసించి ఇంద్రియ నిగ్రహము గలిగియుండుట

అంతశ్శౌచము. సూ॥(శౌచాత్స్వాంగజుగుప్సాపరైరసంసర్గః । సత్వశుద్ధిసౌమనస్యైకాగ్రతేంద్రియ జయాత్మదర్శన యోగ్యత్వానిచ) అంతర్బాహ్యశౌచములను ఆచరించుటవలన శరీర కారణమగు శుక్లశోణితాదులను ఆలోచించును. పిమ్మట శరీరమునందు అసహ్యముగలిగి ఇతర జనసంగమును అపేక్షింపడు. అనంతరము సత్వబుద్ధితో ఏకాగ్రచిత్తముగలిగి ఆత్మస్వరూపమును దర్శించుటకు శక్తుడగును.

కొన్ని గ్రంథములలో ఈయమములు - అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, అని అయిదువిధములని చెప్పియున్నవి. అపరిగ్రహము అనగా:—భోగసాధన పదార్థములను స్వీకరింపకుండుట (ఈ అపరిగ్రహమును ఆచరించుటవలన పూర్వజన్మ స్మరణమును, ఇపుడు ఈజన్మకలుగుటకు కారణమును తెలిసికొనవచ్చును)

( 2 ) నియమము. నియమములు పదివిధములు. శ్లో॥ తపస్సంతోషమాస్తిక్యం దానమీశ్వర పూజనమ్ । సిద్ధాంతశ్రవణంచైవ హ్రీర్మతిశ్చజప ప్రవతమ్ ॥ ఏతేచనియమాఃప్రోక్తా యోగశాస్త్రవిశారదైః ॥ 1 తపస్సు, 2 సంతోషము, 3 ఆస్తిక్యము, 4 దానము 5 ఈశ్వరపూజనము, 6 సిద్ధాంతశ్రవణము, 7 హ్రీ, 8 మతి, 9 జపము, 10 వ్రతము.

[ 1 ] తపస్సు. అనగా:—సూ॥(కాయేంద్రియ శుద్ధి రశుద్ధిక్షయా త్తపసః) కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులచేత శరీరమును కృశింపజేయుట. తపస్సును ఆచరించుటచేత చిత్తముయొక్క అపవిత్రత నశించి దేహేంద్రియములు ఉత్కర్షతనుబొంది సూక్ష్మవస్తుగ్రహణ సామర్థ్యము గలుగును.

[ 2 ] సంతోషము. అనగా:—సూ (సంతోషా దనుత్తమ సుఖలాభః) పేరాశపడక తనకు గలిగినదానితో తృప్తిబొంది లేని దానికి దుఃఖింపకుండుట. సంతోషమును ఆచరించుటచేత ఏసుఖము నకు విషయసుఖములు శతాంశముగానైన పోల్చరగవో అట్టి మహాసుఖము ఆవిర్భవించును.

[ 3 ] ఆస్తిక్యము. అనగా:— వేదములయందు విధింపబడియుండు ధర్మాధర్మములయందు విశ్వాసము గలిగియుండుట.

[ 4 ] దానము. అనగా:— న్యాయముగా దాను ఆర్జించిన ద్రవ్యమును పుణ్యకాలములయందుగాని, ఇతరకాలములయందుగాని, ప్రత్యుపకారమును అపేక్షింపక బీదలు మొదలగు వారలకు భగవదర్పణముగా నిచ్చుట.

[ 5 ] ఈశ్వరపూజనము. అనగా:— సూ॥ (సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్) నిష్కళంకమగు మనస్సుతో దృఢముగ భగవంతుని పూజించుట. విష్ణుమూర్తినైనను, ఈశ్వరునినైనను, పూజించుటవలన సకలవిఘ్నములు నశించి సమాధిసిద్ధి కలుగును.

[ 6 ] సిద్ధాంతశ్రవణము. అనగా:— బ్రహ్మసూత్రములు, జ్ఞానవాశిష్ఠము, భగవద్గీతలు మొదలగు వేదాంతగ్రంథములను శ్రవణముజేయుట.

[ 7 ] హ్రీః. అనగా:— వేదములలో జెప్పియుండు కర్మలకు విరుద్ధముగా తమకుదోచినదంతయు యుక్తమే అని చేయుకార్యములయందు లజ్జ కలిగియుండుట.

[ 8 ] మతి. అనగా:— వేదములలో జెప్పియుండు కర్మలను శ్రద్ధతో జేయుట.

[ 9 ] జపము. అనగా:— వేదవిరుద్ధములుకాని గాయత్రీమొదలగు మంత్రములను సద్గురువులచేత ఉపదేశమునుబొంది జపించుట. జపమువాచికము. మానసికము, అని రెండువిధములు. మంత్రములను గట్టిగా ఇతరులు వినునట్లు ఉచ్చరించుటవలన ఫలము స్వల్పము. తిన్నగా ఉచ్చరించుట పైదానికన్న వెయ్యింతలు అధికఫలము, నోటియందే ఉచ్చరించుట పైరెంటికన్న మిక్కిలి ఫలము. మనస్సులోనే జపించుట ధ్యానసాధనము కావున అన్నింటికన్న మిక్కిలిశ్రేష్ఠము.

[ 10 ] వ్రతము. అనగా:— వేదములలో విధింపబడియుండు కర్మానుష్ఠానములయందు నియమమ్ము గలిగియుండుట.

( 3 ) ఆసనము. అనగా:— మయూరాసనము, సింహాసనము, గోముఖాసనము, పద్మాసనము. అని ఆసనములు 84, వీటిని

గురుముఖముగా దెలిసికొన వలయును. "(ఆసనేన రజోహంతి)" ఆసనములు అభ్యసించుటవలన రాజసగుణము నశించుట, అనేకరోగములు నశించుట, మొదలగునవి కలుగును.

(4) ప్రాణాయామము. అనగా:— ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క గమనాగమనముల నిరోధము చేయుటయే ప్రాణాయామ మనబడును. ఎడమముక్కుబిలముద్వారా పదునారుమారులు "ఓమ్" అను ప్రణవమును ఉచ్చరించుచు శ్వాసమును బీల్చవలయును. ఇదియే పూరకము. పిమ్మట అరువదినాలుగుమారులు "ఓమ్" అను ప్రణవమును ఉచ్చరించుచు అంతవరకును శ్వాసమును లోపలనే నిలపవలయును. ఇదియే కుంభకము. తుదకు కుడిముక్కు బిలముద్వారా ముప్పదిరెండుమారులు "ఓమ్" అను ప్రణవమును ఉచ్చరించుచు శ్వాసము మెల్లగా విడువవలయును. ఇదియే రేచకము. ఇట్లు పూరక కుంభక రేచకములను జేయుట ప్రాణాయామ మనబడును. "ప్రాణాపానసమాయోగః ప్రాణాయామో భవతి" ప్రాణవాయువును అపానవాయువుతో గలుపుటే ప్రాణాయామ మనబడును. కావున ప్రాణాయామము గురు ముఖముగా తెలిసికొని అభ్యసించువారలకు సర్వరోగములు నశించును. అయుక్తముగా అభ్యసించువారలకు సకలరోగములు కలుగును.

(5) ప్రత్యాహారము. అనగా:— సూ॥ విషయేషు విచరితామింద్రియాణాం బలాదాహరణమ్)॥ విషయములయందు సంచరించెడి ఇంద్రియములను బలాత్కారముగ మరలించి సద్విషయములయందు ప్రవేశపెట్టుట, అన్నిటిని భగవత్స్వరూపముగ జూచుట, నిష్కామముగ కర్మలను జేయుట. సూ॥(తతః పరమావశ్యతేంద్రియాణామ్॥) ప్రత్యాహారమును ఆచరించుటవలన మనోవికారము లన్నియు అణగిపోవును. కర్మేంద్రియ జ్ఞానేంద్రియములన్నియు తనకు మిక్కిలి స్వాధీనములై యుండును.

(6) ధారణ. అనగా:— సూ॥(ఆత్మని మనోధారణమ్)॥ మనస్సుయందు పరమాత్మను (భగవంతుని) ధ్యానించుట. శరీరమందలి ఆకాశమునందు (దహరాకాశమునందు) మహాకాశమును

(బాహ్యాకాశమును) భావించుట. సూ॥ (ధారణాభి ర్మనో ధైర్యమ్॥) ధారణను ఆచరించుటవలన మనోధైర్యము గలుగును.

(7) ధ్యానము. అనగా:— సగుణధ్యానము, నిర్గుణధ్యానము, అని రెండువిధములు. సగుణధ్యానమనగా మూర్తిధ్యానము. నిర్గుణధ్యానమనగా ఆత్మలో మనస్సును యాథాత్మ్యమును బొందజేయుట. ధ్యానమును ఆచరించుటవలన, సూ॥ (ధ్యానం చైతన్యమద్భుతమ్॥) స్వప్రకాశము గలుగును.

(8) సమాధి. అనగా:— శ్లో॥ (నశృణోతి యథాకించిత్ నపశ్యతి నజిఘ్రతి। నచస్పర్శంవిజానాతి ససమాధిస్థఉచ్యతే॥) బాహ్యవార్తలను వినకుండుట, బాహ్యసంగతులను జూడకుండుట, బాహ్యపదార్థవాసన పట్టకుండుట, బాహ్యవస్తువుల స్పర్శింపకుండుట, ఏమియు నెఱుగకుండుట, సమాధియని చెప్పబడును. ఇట్లు మనస్సును వశపఱచుకొనిన పిమ్మట, సూ॥ (జీవాత్మ పరమాత్మైక్యావస్థా త్రిపుటిరహితా పరమానందస్వరూపా శుద్ధచైతన్యాత్మికా భవతి॥) జీవాత్మ పరమాత్మలయొక్క ఐక్యమును బొంది మనస్సు జ్ఞాతృ, జ్ఞాన జ్ఞేయము లను త్రిపుటిరహితమై పరమానంద స్వరూపమైన నిత్య, బుద్ధ, శుద్ధ, ముక్త, సత్య, సచ్చిదానంద చైతన్యాత్మకమగుట సమాధియని చెప్పబడును.

శ్లో॥ సమాధౌ మోక్షమాప్నోతి త్యక్త్వాకర్మ శుభాశుభమ్॥ శుభాశుభ కర్మలయందు ఇచ్ఛనువదలి సమాధియందుండిన మోక్షము గలుగును.

ఓం తత్సత్.

సమాప్తము.

—

శ్రీ ర స్తు.

# రాజయోగాధ్యాయము.

రాజయోగ అష్టాంగయోగముల వివరము:—1 యమము, 2 నియమము, 3 ఆసనము, 4 ప్రాణాయామము, 5 ప్రత్యాహారము, 6 ధారణము, 7 ధ్యానము. 8 సమాధి.

( 1 ) యమమనగా:—శ్లో॥ సర్వంబ్రహ్మేతి విజ్ఞానా దింద్రియగ్రామ సంయమః । యమోయమితి సంప్రోక్తో ఽభ్యసనీయో ముహుర్ముహుః॥

తా॥ సర్వమును భగవంతునియొక్క ( బ్రహ్మయొక్క ) స్వరూపముగా తెలిసికొనుటవలన ఇంద్రియములను విషయములయందుండి త్రిప్పి ఆత్మయందు నిలుపుటయే యమమని చెప్పబడును. దీనిని మోక్షమునందు అపేక్షగలవారు మాటిమాటికి విషయములలో ప్రవేశించు ఇంద్రియసమూహములను బ్రహ్మమునందు ( భగవంతునియందు ) నిలుపుట అగు అభ్యాసమును పదేపదే చేయవలసినది.

( 2 ) నియమమనగా:—శ్లో॥ సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః । నియమోహిపరానందో నియమాత్క్రియతే బుధైః॥

తా॥ ఆత్మకంటె (బ్రహ్మముకంటె) భిన్నముగా దోచు అవిద్యచేత గనబడు విజాతీయమైన సమస్తమును ఎడబాసి సజాతీయప్రవాహమునందే మనస్సును నియమించుట నియమమని చెప్పబడును.

( 3 ) ఆసనమనగా:— సుఖేనైవభవేద్యస్మిన్ నజస్రంబ్రహ్మచింతనమ్ । ఆసనంతద్విజానీయాత్ నేతరత్సుఖనాశనమ్॥

తా॥ భగవంతుని చింతనచేయుటకంటె ఇతరములైన ఎట్టివస్తువులయందును మనస్సు సుఖమునుబొందక ఎప్పుడు నిలిచిపోవునో అట్టిస్థితియే ఆసనమని చెప్పబడును. కాళ్ళను చేతులను ముడుచుకొని బంధించి శ్రమపడుట సుఖమైన ఆసనముగాదు.

( 4 ) ప్రాణాయామమనగా:— శ్లో॥ చిత్తాదిసర్వభావేషు బ్రహ్మత్వేనైవభావనాత్। నిరోధస్సర్వవృత్తీనాం ప్రాణాయామస్స ఉచ్యతే॥

తా॥ మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనెడి అంతఃకరణమునందు బ్రహ్మమును ( భగవంతుని ) తప్ప వేఱే భావనయే లేకుండుటయు ఇతరభావనలును చిత్తమునకు బాహ్యవృత్తియు గలుగునప్పుడు వానిని చిత్తములోనుంచి తొలగించి బ్రహ్మభావనయందు మనస్సును నిలుపుటయే ప్రాణాయామమని చెప్పబడును. మఱియును, రేచక, పూరక, కుంభకములనగా: — శ్లో॥ నిషేధనంప్రపంచస్య రేచకాఖ్యస్సమీరణః। బ్రహ్మైవాస్మీతియావృత్తిః పూరకో వాయురీరితః॥ తతఃతద్వృత్తినైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః॥ బ్రహ్మమునందు ( భగవంతునియందు ) మనస్సును చలింపక నిలుపుటకు సాధనమైన ప్రాణాయామమునందు చరాచర ప్రపంచముయొక్క తలంపు మనస్సునకురాకుండ తొలగించుటయే రేచకమని చెప్పబడును. అటు తొలగించిన పిమ్మట బ్రహ్మైవాస్మి అనెడు మనోవృత్తితో నుండుటయే పూరకమని చెప్పబడును. అట్లు బ్రహ్మైవాస్మి అనెడు చింతనము ప్రబలమై మనస్సు బ్రహ్మాకారముగ నగుటయే కుంభకమని చెప్పబడును.

( 5 ) ప్రత్యాహారమనగా:—శ్లో॥ విషయేష్వాత్మతాందృష్ట్వామనసశ్చితి మజ్జనమ్। ప్రత్యాహారస్సవిజ్ఞేయో ఽభ్యసనీయో ముముక్షుభిః॥

తా॥ తాను ఏపదార్థమును చూచినను అది తనకు ఆత్మగా ( భగవంతునిగా ) చూచుటయును, మానావమానములు లేక ఆపరమాత్మయందే మనస్సును సమర్పించియుండుటయును అనునట్టి స్థితియే ప్రత్యాహారమని చెప్పబడును. దీనిని మోక్షాపేక్ష గలవారలు అవశ్యముగా అభ్యసింపవలయును.

( 6 ) ధారణఅనగా:—శ్లో॥ యత్రయత్రమనోయాతి। బ్రహ్మణస్తత్రదర్శనాత్। మనసోధారణంచైవ ధారణాసా పరామతా॥

తా॥ మనస్సు ఎచ్చటెచ్చట నేనూ ఉన్నానూ అని వచ్చునో,

అచ్చటచ్చట అప్పుడప్పుడు ఆమనస్సును తొలగించి సమస్తమును బ్రహ్మముగాజూచు అభ్యాసమే ధారణయని చెప్పబడును. అట్లు అభ్యాసముచేయుటచేత మనస్సు ధారణ అనే స్థితిని జెందును.

( 7 ) ధ్యానమనగా: — శ్లో ॥ బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయాస్థితిః । ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ॥

తా॥ మనస్సు ఎప్పుడు బ్రహ్మైవాస్మి అనెడు మనోవృత్తిచేత ఎడతెగక బ్రహ్మమునందునిలుచునో అప్పుడు అట్టి ఆనందమైనస్థితినే ధ్యానమని చెప్పబడును.

( 8 ) సమాధిఅనగా:—శ్లో ॥ నిర్వికారతయావృత్త్యా బ్రహ్మాకారతయాపునః । వృత్తివిస్మరణంసమ్యక్ సమాధిః జ్ఞానసంజ్ఞకః॥

తా॥ మనస్సు నిర్వికల్పమై బ్రహ్మాకారము గలదియగునో, ఎప్పుడుమనస్సు తన్ను దాను మఱచి బ్రహ్మమునందు లయించునో, అప్పుడు సమాధీ అని చెప్పబడును.

శ్లో ॥ జయతి జయతి దేవో దేవకీ నందనోయం
జయతి జయతి కృష్ణో వృష్ణివంశ ప్రదీపః ।
జయతి జయతి మేఘశ్యామలః కోమలాంగో
జయతి జయతి పృథ్వీ భారనాశో ముకుందః॥

ఇట్లు సంస్కృత ప్రాకృత వైకృతా ద్యనేకభాషా నిపుణులగు
బ్రహ్మశ్రీ వెన్నలకంటి - సుందరరామశర్మగారిచే
రచియింపబడిన బ్రహ్మసూత్రరహస్యము - సమాప్తము.

ఓం తత్సత్

శ్రీ కృష్ణార్పణమస్తు.

ఓమ్

శ్రీ పరబ్రహ్మణే నమః.

# వేదాంత పంచరత్న మాలికా స్తోత్రమ్:

వేదోనిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం తేనే
శస్యవిధీయతా మపచితిః కామే మతి స్త్యజ్యతామ్ । పాపౌఘః పరి
ధూయతాం భవసుఖే దోషోనుసంధీయతా మాత్మేచ్ఛా వ్యవసీయ
తాం నిజగృహా త్తూర్ణం వినిర్గమ్యతామ్ ॥ 1
సంగస్సత్సువిధీయతాం భగవతో భక్తిర్దృఢా ధీయతాం
శాంత్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మా సుసంత్యజ్యతామ్।
సద్విద్వా నుపసర్పతాం ప్రతిదినం తత్పాదుకే సేవ్యతాం బ్రహ్మై
కాక్షర మర్థ్యతాం శ్రుతిశిరో వాక్యం సమాకర్ణ్యతామ్ ॥ 2
వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరః పక్ష స్సమాశ్రీయతాం
దుస్తర్కా త్సువిరమ్యతాం శ్రుతిమత స్తర్కోఽనుసంధీయతామ్ ।
బ్రహ్మైవాస్మివిభావ్యతా మహరహో గర్వఃపరిత్యజ్యతాందేహా
హం మతిరుజ్ఝ్యతాం బుధజనై ర్వాదః పరిత్యజ్యతామ్ ॥ 3
క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం ప్రతిదినం భిక్షౌషధం భుజ్య
తాం స్వాద్వన్నం నతుయాచ్యతాం విధివశాత్ప్రాప్తేన సంతుష్య
తామ్ । శీతోష్ణాది విషహ్యతాం నతు వృథావాక్యం సముచ్చార్య
తా మౌదాసీన్య మభీప్స్యతాం జనకృపా నైష్ఠుర్య ముత్సృజ్యతాం॥
ఏకాంతే సుఖమాస్యతాం పరతరే చేతస్సమాధీయతాం
పూర్ణాత్మాను సమీక్ష్యతాం జగదిదం తద్బాధితం దృశ్యతామ్।
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం చితిబలా న్నాప్యుత్తరేశ్లిష్యతాం ప్రా
రబ్ధం త్విహభుజ్యతా మథ పరబ్రహ్మాత్మనా స్థీయతామ్ ॥ 5
యశ్శ్లోకపంచకమిదం పఠతే మనుష్య స్సంచితయ త్యనుదినం
స్థిరతా ముపేత్య । తస్యాశు సంసృతి దవానల తీవ్రఘోర తాపప్ర
శాంతి ముపయాతి చితిప్రసాదాత్ ॥ 6

ఇతి శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీమ చ్ఛంకరాచార్య విరచితం వేదాంత
పంచరత్నమాలికా స్తోత్రం సంపూర్ణమ్,